# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **తెలుగు భక్తి** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **తెలుగు భక్తి** వారి వెబ్ సైట్: http://www.telugubhakti.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## తెలుగు భక్తి వారి వెబ్ సైట్:

## http://www.telugubhakti.com/

Telugu Bhakti Slokas

www.telugubhakti.com/telugupages/main.htm

# Telugu Bhakti Pages

www.telugubhakti.com

**Best viewed with screen settings 1280X1024 pixels**

| Scriptures, Slokas and Stotras | | General | Downloads |
|---|---|---|---|
| Adi Sankaracharya<br>Aditya<br>Adwaitam<br>Ayyappa<br>Bhagavad Geetha<br>Bammera Pothana<br>Bhagavatam<br>Brahma Sutras<br>Durga<br>Dattatreya<br>Ganesh<br>Gayatri<br>Guru<br>Hanuman<br>Hindu Marriage System<br>Krishna<br>Lakshmi<br>Mahabharat<br>Mantrapushpam<br>Narada Bhakti Sootralu<br>Nava Grahas<br>Patanjali Yoga Sootralu<br>Raghavendra<br>Rama<br>Ramayanam | Rama Geeta<br>Saraswathi<br>Sandharbha<br>Satya Sai<br>Shirdi Sai<br>Siva<br>Slokas with meaning<br>Subrahmanya<br>Suktas<br>Sundara Kanda<br>Venkatesa<br>Vishnu<br>Vratas<br>Upanishads<br>Rigveda<br>Samhitaanuvadam<br>(Yoga Paranga)<br>Vyasa Bhagavatam | Appeal and Objectives<br>Bala Basha<br>Bhakti Celebrities<br>Bhakti Classicals<br>Bhakti Links<br>Book Reviews<br>Jeji Mamayya Patalu<br>Chatuvulu<br>Dasa Mudrani<br>Divine Guidance of Satya Sai<br>Kavitha Kadambam<br>Keerthanalu<br>Koonalamma Padalu<br>Prasnalu - Javaabulu<br>Naturopathy<br>Rishi Vani<br>Sai Krishna's Art<br>Satakalu<br>Swamiji<br>Tatvalu<br>Telugu Special<br>Useful Links<br>Value Education<br>Web Hunt<br>Hindu Cultural<br>Questions & Answers<br>Yoga<br>Yoga Mudralu Bandhalu<br>Yogasanas (Detailed) | Audio Downloads<br>Bhakti Screen Savers<br>Printer Friendly Page<br>**Pravachanaalu**<br>Bhaja Govindam<br>Bhasmo Dhulita Vigrahaya<br>Karma Siddhantam<br>Class Prayers<br>Kenopanishad<br>Sri Narasimha Charitram<br>Soundarya Lahari<br>Ramana Saranagathi<br>Vivekachoodamani<br>**Specials**<br>Annamayya Pada Visleshana<br>Monthly<br>Satsang<br>Chinna Kathalu<br>Class Prayers<br>Human Relations<br>Nadiche Devudu<br>Stories of Alwars<br>Stories of Bhaktas<br>Stories of Indian Sages<br>Stories of Nayanars<br>Sankara Vangmayamu<br>Special Articles<br>Hinduism and Mantras<br>Personality Development |

Join Bhakti Group

Statistics of page views

[About us][Mission][People][Links][Books]][Guest Book][Contact]

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓం శ్రీ సాయి రాం

# కుమార శతకము

(టీకాతాత్పర్యసహితము)

1. శ్రీ భామినీ మనోహరు
సౌభాగ్య దయా స్వభావు సారసనాభున్
లోఁభావించెద; నీకున్
వైభవము లొసగుచుండ వసుధఁగుమారా!

ఓ కుమారా! లక్ష్మీ వల్లభుడైన శ్రీహరి, పద్మనాభుడు, దయాశాలి నీకు సర్వసంపదలు ఇచ్చుదాత.

2. ఆజ్ఞ యొనర్చెడి వృత్తుల
లో జ్ఞానము గలిగి మెలుగు లోకుల మెచ్చన్
బ్రాజ్ఞతను గలిగి యున్నన్
బ్రాజ్ఞులలోఁబ్రాజ్ఞుఁడవుగ ప్రబలు కుమారా!

ఓ కుమారా! నీవు సమర్థుడుగా పేరు పొందుటకు నీకిచ్చిన పనిని నైపుణ్యముగా చేయుటయే కావలెను.

3. అతి బాల్యములో నైనను
బ్రతికూలపు మర్గాములఁ బ్రవర్తింపక స
ద్గతి మీర మెలగ నేర్చిన
నతనికి లోకమున సౌఖ్యమగును గుమారా!

కుమారా! సుఖమునననుభవించుటకు బాల్యము నుండి దుందుడుకు చేష్టల చేయక సత్ప్రవర్తన కల్గిన వాడే తగును.

4. వృద్ధజన సేవ చేసిన
బుద్ధి విశేషజ్ఞుఁ బూత చరితుడున్
సద్ధర్మశాలియని బుధు
లిద్ధర ఁబొగిడెదరు ప్రేమయెసగ ఁగుమారా!

పెద్దలు మెప్పు పొందుటకు వారిని భక్తితో సేవించుటయే మార్గము.

5. పెద్దలు వద్దని చెప్పిన
పద్దుల బోవంగరాదు పరకాంతల నే
పొద్దే నెదఁబరికించుట
కుపదేశింపగ ఁగూడ దుర్వీఁ గుమారా!

పరస్త్రీలను కించపర్చుట, పెద్దలనెదిరించుట మంచి నడవడి కలవానికి తగవు.

6. తనపైదయ నుల్కొనఁ గను
గొన నేతెంచినను శీల గురుమతులను పం
దనముగఁ భజింపందగు
మనమలరగ నిదియ విబుధ మతము కుమారా!

బుద్ధిమంతుడు తన యందు ఆపేక్ష కల్గినవారిని సత్ప్రవర్తన కల్గిన పెద్దలను గౌర వించును సంభావించును.

7. ఉన్నను లేకున్నను పై
కెన్నడు మర్మంబుఁ దెలుప నేగకుమీ నీ
కన్నతల్లిదండ్రుల యశం
బెన్నఁబడెడు మాడ్కిఁదిరుగు మెలమిఁగమారా!

నీ తల్లి దండ్రులకీర్తి నలుదిశల వ్యాపింపవలెనన్న నీవు గుట్టుగా సత్ప్రవర్తన కల్గిన వాడివయిననే సాధ్యము.

8. పెద్దలు విచ్చేసినచో
బద్ధకమునైన దుష్ట పద్ధతి నైనన్
హద్దెరిగి లేవకున్నన్
మొద్దువలె జూతు రతని ముద్దు కుమారా!

పెద్దలు యందు వినయము చూపకున్న నిన్ను మొద్దువలె చూతురు.

9. సతతముఁ బ్రాతః కాలో
చిత విధులకు జరుపు మరసి శీఘ్రముగా సహః
పతి పూర్వపర్వతాగ్రా
గతుడగుటకు మున్నె వెరవు గల్గి కుమారా!

ప్రాత: కాలముననే (సూర్యోదయవేళకే) లేచి నిత్యకృత్యములు తీర్చుకొనవలెను.

10. పోషకుని మతముఁగనుగొని
భూషింపక గాని ముదము బొందురు మఱియున్
దోషమును నెంచు చుండును
దోషివయిన మిగులఁ గీడు దోచుఁ గుమారా!

యజమాని మనసెరిగి మసలినవాడే నేర్పరి. అట్లు మసలనిచో యజమాని నీలో తప్పులన బట్టును.

11. నరవరుడు నమ్మి తను నౌ
కరిలో నుంచునెడ వాని కార్యములందున్
సరిగా మెలంగ నేర్చిన
పురుషుడు లోకమున ఁగీర్తి ఁ బొందుఁ గుమారా!

రాజు నమ్మిన మనిషిని, అతడు నేర్పరియైనచో, ప్రజలు అందలము ఎక్కింతురు.

12. పుడమిని దుష్టత గల యా
తడు లంచంబులు బట్ట దలచుచు మిడియౌ
నడవడి విడి యందెరి వెం
బడి భ్రష్టికొనుచును గీడు వరుప కుమారా!

దుష్టుడు తన యొక్క చెడునడవడితో, లంచగొండి తనముతో ఇతరులకు కీడు కల్గించును.

13. పనులెన్ని కలిగి యున్నను
దినదినమున విద్యపెంపుధీయుక్తుడవై
వినగోరుము సత్కథలను;
కవి విబుధులు సంతసించు గతినిఁ గుమారా!

బుద్ధిమంతుడు ఎన్ని కార్యములు నిర్వహించుచున్నను విద్యాధికులకు, పెద్దలకు గౌరవ మొసంగి సత్కాలక్షేపము కొంతసేపైనను చేయును.

14. ధరణీ నాయకు రాణియు
గురు రాణియు నన్నరాణికులకాంతను గ
న్న రమణి దనుగన్న దియును
ధరనేవురు తల్లులనుచుఁ దలుపు కుమారా!

ప్రతివానికి అయిదుగురు మాతలుందురు. అది ఎట్లన రాజు భార్య, గురుపత్ని, అన్న భార్య, కులకాంత, భార్య తల్లి వీరికిని తల్లికిచ్చిన గౌరవము నీయవలెను.

15. సదమల మతితో (బెద్దల
మదికింపుగ మెలగు, నిందమానుము పరులన్
మృదుమార్గములను వదలకు

విదితంబుగ దానఁ గీర్తి వెలయుఁ గుమారా!

సుమతివై,సన్మార్గములోజీవించిన, పెద్దలకు సంతోషము, నీకు సత్కీర్తి కలుగును.

16. ఆచార్యున కెదరింపుకు
బ్రోచిన దొర నింద సేయఁ బోకుము కార్యా
లోచనము లొందఁ జేయకు
మాచారము విడవఁ బోకుమయ్య! కుమారా!

మంచి నడవడిక కల్గి, గురువునకు, యజమానికి ఎదురు చెప్పక, తాను చేయు పని గూర్చి పరిపరి విధముల నాలోచింపక చేయువాడే నేర్పరి.

17. పుట్టినది మొదలు పరసతి
బట్టగఁ జూచుటయు నింద పద్ధతి యనుచు
న్నట్టి పురుషుండు పుడమిం
బుట్టిన జనతతులఁ గీర్తిబొందుఁ గుమారా!

కుమారా! పరకాంతలనుచేపట్టుట, విషయవాంఛ లేని వాడే చిరకీర్తిని పొందును

18. కల్లలగు మాట లాడకు
మెల్లజనంబులకు వేగ హృదయము కడు రం
జిల్లగ ఁ బల్కుము నీ కది
తెల్లము రహిఁగీ ర్తిఁగాంచు దెరగు కుమారా!

అసత్యము లాడక, ప్రియమైన మాటలు మాట్లాడువాడే నిజమైన ఆనందమును కీర్తిని పొందును.

19. ఏనాడైనను వినయము
మానకుమీ మత్సరమున మనుజేశులతోఁ
బూనకు మసమ్మతము బహు
మానమునను బొందు మిదియె మతము కుమారా!

వినయమును వీడక, పైఅధికారులతో వాగ్వివాదములకు పోక, మెలకువతో మెలగు వాడే సన్మానమును పొందును.

20. నగ (గూడదు పరసతిఁగని
తన మాతృ సమానమెన్నదగు; నెవ్వరితోన్ఁ
బగ గూడ, దొరుల నిందిం
పగ (గూడదు, గనుము వృద్ధ పథము కుమారా!

అకారణ వైరము, పరులను నిందించుట, పరస్త్రీలను వాంఛించుట చేయక ఋజువర్తనుడవై మెలగవలెను.

21. చేయకుము కాని కార్యము
పోయకుము మఱిన్ శుభం బవని భోజనమున్
జేయకుము రిపు గృహంబున
గూయకు మొరుమనసు నొచ్చుగాత కుమారా!

మంచి, చెడ్డ విచక్షణ కల్గి, ఇతరులను నొప్పించనివాడే నేర్పరి. 'ఎప్పటికెయ్యది ప్రస్తుతంబో.... సుమతీ' ఈ పద్యభావము ఇక్కడ సూచితము.

22. పిన్నల పెద్దల యెడు గడు
మన్ననచే మెలగు సుజన మార్గంబులనీ
వెన్ని కొని తిరుగుచుండిన
నన్ని యెడల నెన్న (బడదువన్న కుమారా!

లోకమందు ప్రఖ్యాతి పొందుటకు, పిన్న, పెద్దలలయందు మంచి నడవడి కల్గి యుండుటయే కారణము.

23. తనకు విద్యాభ్యాసం
బును జేసినవానికన్న బొలుపుగ బదిరె
ట్లను దూగు దండ్రి వానికి
జననీయు బదిరెట్లు దూగు జగతి గుమారా!

లోకమందు విద్యనేర్పిన గురువుకన్నను తండ్రి పదిరెట్లెక్కువ. తండ్రికన్నను, తల్లి పది రెట్లెక్కువ. తల్లిదండ్రులు పూజనీయులు.

24. తమ్ములు తమయన్న యెడ భ
యమ్మును భక్తియును గలిగి యారాధింపన్
దమ్ముల నన్నయు సమ్మో
దమ్మును బ్రేమింప గీర్తి దనరు కుమారా!

అన్నదమ్ములు అన్యోన్యప్రేమికులయిననే రామలక్ష్మణుల వలె కీర్తిపొందుదురు.

25. అప్పం దన తల్లి గ మే
లొప్పంగని జరుపవలయు నుర్వీస్థలిజ
న్నప్పడు చన్నిడి మనిపిన
మప్పడతియు మాతృతుల్యయండ్రు కుమారా!

అక్కయును, పాలిచ్చిపెంచిన దాదాయును కూడా మాతృస్థానీయులు.

26. బూటకపు వర్తనము గని
జూటరి వీడనుచు దప్ప జాతురుగా! యా
బాటను విడి సత్యము మది
బాటించి నటించు వాడె నరుడు కుమారా!

ఉత్తముడు అసత్యములు పలుకక, కపటమార్గమున చరింపక నీతి వర్తనుడై ఉండును.

27. తనయుడు చెడుగై యుండిన
జనకుని తప్పన్న మాట సత్యమెఱుగుదు గా
వున నీ జననీ జనకుల
కు నపఖ్యాతి యగురీతి గొనకు కుమారా!

నీవు దుష్టుడవైన నీ తండ్రిని జనులు నిందింతురు. తండ్రికి చెడ్డపేరు తేకుము.

28. తల్లిని దండ్రిని సహజుల
నల్లరి బెట్టినను వారాలలుగుచు నీపై
నుల్లమున రోయు చుందురు
కల్లరి వీడనుచు గీర్తి గంద గుమారా!

నీ కుటుంబములో నీవు మంచివాడ వనిపించుకోవలెను. తల్లిదండ్రులు, సహోదరులు రోతపడుతున్నట్లు ప్రవర్తించకూడదు. 'ఇంట గెలిచిననే, రచ్చగెలువగలవు'.

29. లోకులు తను గొనియుడు వి
వేకి యదియు నిందగాక విననొల్లదు సు
శ్లోకుల చరితం బిట్టిది
చేకొనవలె నట్టి నడక చిన్ని కుమారా!

దూషణ, భూషణల కతీతుడైన వ్యక్తియే గౌరవము పొందును. నీవు ఇట్టినడవడికను అలవరచుకొనుము.

30. ధరణిని పరోపకారా
చరణ ప్రతినిష్ఠనెపుడు సలుపుము నీకా
తెరగున వాసాదివ్రత

వరకర్మము కంటె మేలు వచ్చు కుమారా!

పరోపకారియే నిష్టాగరిష్టునకైన మిన్న. పరోపకారము అలవరచుకొనుము.

31. వగవకు గడచిన దానికి
పొగడకు దుర్మతుల నెపుడు; పొసగని పనకై
యొగి దీనత నొందకుమీ
తగ దైవగతిం బొసంగు ధరను కు మారా!

గతమును గూర్చి వగవక, దుష్టులను పొగడక, అసాధ్యములు సాధింప బూనక, విధి విలాసము ననుసరించి సాగవలెను.

32. పని బూని జనులు సంతస
మునఁ దాలిమి సత్యశౌచములను బ్రవర్తిం
చిన యశము నొందచుందురు
గనుడొను మిదె దొడ్డ నడకఁ గాక కుమారా!

సత్యవ్రతుడే కీర్తిగాంచును. కాననీవు సత్యవ్రతుడవుకమ్ము.

33. విను లోకంబున ధర్మం
బసఁగ గులాచారమట్ల నరసి నడువఁదా
గను మాయుః కీర్తుల నిహ
మనఁ బరమునఁ బొందు సౌఖ్యములను గుమారా!

కులాచారమును గౌరవముతో ఆదరించిన ఇహపరలోక సౌఖ్యము కల్గును.

34. సరి వారి లోన నేర్పున
దిరిగెడి వారాలకు గాక తెరవాటులలో
నరయుచు మెలగెడి వారికి

పరు వేటికి గీడె యనుభవంబు కుమారా!

సజ్జనసాంగత్యము నీకు ఎట్లు పేరుతెచ్చునో దుర్జన సాంగత్యము కీడు చేయును.

35. బరులెవ్వరేని దనతో
బరిభాషించినను మేలు పలుక వలయునా
దరము గల చోట (గీడు
సర్గము నొనర్వంగరాదు గదర కుమారా!

ప్రియభాషణలతో ఆదరము పొందవచ్చును.

36. సిరి చేర్చు బంధువుల నా
సిరయే శుభముల నొసంగు చెలువుల గూర్చున్
సిరియే గుణవంతుండని
ధరలో( బొగడించునంచు దలపు కుమారా!

'ఎప్పుడు సంపద గల్గిన... సుమతీ' పద్యభావమునకు తగినదీ పద్యము. కుమారునికి సంపద సధింపవలెనని దానివలన అధికగౌరవముకల్గునని చెప్పచున్నాడు.

37. ఆకులత బడకు మాపద
నేకతమున (జనకు త్రోవ నింతకి దగు సం
తేకాని చన వసంగకు
లోకులు నిన్నెన్న సుగుణలోల! కుమారా!

లోకములో గణ్యత పొందుటకు నీవు కష్ట సమయము లందు ఆందోళన పొందకుండుట, భార్యకు అతి చనువు ఇయ్యకుండుట, ఒంటరి ప్రయాణములు చేయకుండుట కారణములు కాగలవు.

38. తనదు కులాంగన యాలో

చనమున మంత్రియు భుక్తి సమయంబున దా
జననియు రతిలో రంభా
వనజేక్షణ యయిన ఁబుణ్యవశము కుమారా!

నీ భార్య, నీకు ఆలోచనలందు మంత్రిగా, భోజన సమయమందు తల్లిగా, శయన వేళ రంభగా ఉన్న అది నీ పుణ్య ఫలమే.

39. మనుజుడు సభ్యుడు దానై
కనియున్న యథార్థమెల్ల కానిన యాట్లా
మనుజుఁడు పలుకకున్నను
ఘనమగు పాతకము నాడు గనును కుమారా!

చూచిన విషయమును నిర్భయముగా చెప్పినవాడే సజ్జనుడు. చూచియు చూడకుండనట్లు పోవువాడు పాపియగును.

40. అంగీకార రహితమగు
సంగతికిం బోవరాదు సామాన్యులతో
డం గడు జగడమునకు జన
వెంగలితనమంద్రు జనులు వినుము కుమారా!

బుద్ధిహీనుడే తగని వారితో జగడములకు దిగును. తనకుసాటి కాని వారితో సాంగత్యము కూడదు.

41. అల దేవగృహము కడప యి
రుల గొవాటముల యుందు ద్రోవలలోర
చ్చల కొట్టములను నొప్పదు
మల మూత్ర విసర్జనంబు మహిని కుమారా.

మల, మూత్ర విసర్జన కాని తావులందు (గుడి, ఇంటి ముంగిట, పశుశాల, మార్గము, రచ్చలు) చేయరాదు.

42. తనుజులనుం గురు వృద్ధుల
జననీ జనకులను సాధుజనుల నెవడు దా
ఘను డయ్యు బ్రోవడో యా
జనుడే జీవన్మృతుండు జగతి కుమారా!

కుమారులను, గురువులను, ముసలివారిని, తల్లిదండ్రులను, సత్పురుషలను రక్షించి పోషించని వాడు బతికియు చచ్చినవాడే.

43. ధీరుడు తన దగు సంపద
జారిన యెడ జింత నొందజాలక దా ల
క్ష్మీ రమణుని వర చరణం
భోరుహములు గొలిచి ముక్తి బొందు కుమారా!

ధైర్యవంతుడు సంపదలన్నియు పోయినను, కష్టములు చుట్టుముట్టినను దైవ భక్తిని మానక ముక్తిని పొందును.

44. పాపపు బని మది దలపకు
చేపట్టిన వారి వుడవ జేయకు కీడున్
లోపల తలపకు, క్రూరల
ప్రాపును మరి నమ్మబోకు, రహిని కుమారా!

దురాలోచనలకు తావీయక, ఇచ్చిన మాట నిల్పుకొనుచు, ఆపదలను తలుపక, నీచులు ఆదరణ నమ్మని వాడే ధీమంతుడు.

45. జగడంబులాడు చోటను
మగువలు వసియించుచోట మదగజము దరిన్

బగతుఁడు తిరుగుచోటన్
మగుడి చనగవలయుఁ జలము మాని కుమారా!

విడువదగిన ప్రదేశములు - పోట్లాట జరుగుచోటు, స్త్రీజనము వుండు చోటు, శత్రువు నివసించు స్థలము, మదించిన ఏనుగు తిరిగే తావు.

46. దర్జనుల నైనఁదిట్టకు
పర్జింపకు సుజన గోష్టి; పరులను నెల్లన్
నిర్జింతుననుచుఁద్రుళ్లకు;
దుర్జనుడంత్రు నిను నింద దోపకుమారా!

దుష్టుల దూరక, సజ్జన సాంగత్యము వీడక, ప్రగల్భములు పలుకక వుండిననే నిన్ను ధీశాలి అందురు.

47. తిరుగకు దుర్మార్గులతో
నరుగకు గహనాంతరస్థలాదుల కొంటాన్
జరుగకు శత్రుల మోల
న్మరుపకు మేల్ హితులయెడల మదిని కుమారా!

ఉపకారిని మరువకుము, దుష్టులకు దూరముండుము. శత్రువుల దగ్గరికి పోరాదు. ఏకాకిగా అడవులందు ప్రయాణము కూడదు.

48. తరలాక్షుల యెడ నెన్నడు
బరిహాసాలాపములను పచరింపకుమీ
బదికించి నిరీక్షించిన
నురు దోషంబనుచు దలపుచుండు కుమారా!

స్త్రీల గురించి ఇతరులతో పరిహాసములాడక, వారిని వంచింపక మెలగ వలెను.

49. సంపద గల వారిని మో
దింపుచు జట్టుకొని యందు రెల్లప్పడు స
త్సంపద తొలంగిన ను పే
క్షింపుదు రవివేక జనులు క్షితిని కుమారా!

అవివేకులు ధనము కల్గిన వారిని కీర్తించుచూ తిరిగెదరు. వారికీ ధనము పోయినను తిరిగి చూడరు.

50. కాయమున నాటు శరములు
పాయంబున దీయవచ్చు బహునిష్ఠురతన్
గూయ మదినాటు మాటలు
పాయవుగా యెపుడు నెగడు పరుచు కుమారా!

మాటల చేత కలిగెడు గాయము ఎన్నటికినీ పోదు. బాణముల చేత కల్గిన గాయము మానును. కాన నిష్టుర వచనము లాడకూడదు.

51. ధరణీజాతములో యే
తది నెట్లట్లను ఫలించుఁదగనటు పూర్వా
చరణ ఫలంబు ననుభవము
గరమును భవనీయమగును గాదె కుమారా!

కాల మెరిగి పుష్పించు, ఫలించు వృక్షములనే మనుజుడు తన పురాకృత పాప పుణ్యములను తగిన రీతిగా అనుభవించుచున్నాడు.

52. పెను కోపము గర్వము ను
బ్బును జపలము దురభిమానము నిర్వ్యాపారం
బునుఁ జొరవు నునికియును న
ల్పుని గుణము లటంచు దెలివిబొందు కుమారా!

నీచుని గుణములు, అతికోపము, గర్వము, అతిశయము, అహంకారము, అవిధే యత, సోమరితనము. వీనిని దరిచేరనీయకుము.

53. విత్తము గూర్చిన మనుజుం
డు త్తమ దానంబు భోగ మొందని యెడ భూ
భృత స్కర శిఖి గతము వి
వృత్తికంబగును నట్టి పదవి కుమారా!

అతిగా సంపాదించి సద్వినియోగము చేయని సంపద రాజులపాలు, దొంగలపా లుఅగును.

54. సద్గోష్ఠి సిరియు నొసగును
సద్గోష్ఠియె కీర్తి బెంచు సంతుష్టిని నా
సద్గోష్ఠియె యొనగూర్చును
సద్గోష్ఠియె పాపములను జంపు కుమారా!

సజ్జన సాంగత్యము సభలలోగాని, బయటగాని కీర్తి, ప్రతిష్ఠలు మరియు సంపద లు కలుగచేయును. పాపములు తొలగించును. మానసిక తృప్తి నిచ్చును.

55. ఘనులు విని సమ్మతింపని
పనులకు జొరబడక పొగడు పనులను జొరు; మెం
దును బొంక బోక కడు స
జ్జనములతో గలసి మెలగు జగతి కుమారా!

పెద్దలు మెచ్చని పనిని చేయక, కల్లలాడక, మంచి వారితో స్నేహము చేయుచుం డుము కుమారా!

56. జారులతో జోరులతో
క్రూరులతో నెపుడుపొత్తు గోరక మది స
త్పూరుష పదాంబు జాతా
ధారుడవై బ్రతుకు కీర్తి తనరు కుమారా!

దుర్జన సాంగత్యము ఏకాల మందైననూ చేయకూడదు. మంచివారి పాదసేవవల
న కీర్తిని గాంచును.

57. జ్ఞానుల చరితము వీనుల
నానుచు సత్పురుష గోష్ఠి ననఘంబనుచున్
బూనుము; ధర్మపథంబును
దా నెరిగినయంత; మరువదగదుకుమారా!

నీకు తెలిసిన ధర్మమార్గము వీడక, మంచివారి సావాసముతో కీర్తి ప్రతిష్ఠలు
పొందుము.

58. రోషా వేశము జనులకు
దోషము తలపోయ విపుల దుఃఖకరము నౌ
రోషము విడిచిన యెడ సం
తోషింతురు బుధులు హితము దోపకుమారా!

మంచిని కోరువారు కోపావేశములను వదలివేయవలెను. అపుడే సుఖసంతోష
ములు కల్గును. విబుధులు సంతసింతురు.

59. ధనవంతు లైన బహు స
జ్జనులైనను నీకు మిగుల సమ్మతులై యు
న్నను సతి జనకుని గృహమం
దున నుండుట తగదు కీర్తి తొలుగు కుమారా!

భార్యను ఎక్కువ కాలము పుట్టింట వుంచిన పురుషుని సౌఖ్యము తొలగిపోవును.

60. సభలోపల నవ్విన యెడ
సభవా ర్లి రసింతు రట్టి జనుని న్నెరి నీ
కభయం బొసంగె నేనియు
బ్రభు కరుణను నమ్మి గర్వపడకు కుమారా!

'లక్ష్మణదేవర నవ్వు' వలె సభలలోను, నలుగురు కూర్చొన చోట నవ్వరాదు. రాజు యొక్క శరణు పొందితినని గర్వింపకూడదు.

61. తనపం క్తి యందు బాంధవ
జనము లోక విధంబుగా మెసంగుచు నుండం
గను దా సద్రసముల మెస
గిన విషభోజన సమంబు క్షితిని కుమారా!

పంక్తిలో తానొక్కడు షడ్రసోపేతమయిన భోజనము చేసిన అది విషాహారముతో సమానము.

62. పెరవారలుండ ఫలముల
నరయంగా వారికిడక యాతడెమెసవన్
సరికాదు విసపు మేతకు
సరియౌనని తలపు మానసమున కుమారా!

అట్లే ఇతరుల ఎదురుగా ఫలములు తానే తిన్నను విషముగా మారును.

63. గుణవంతుని సంగతి ని
ర్గుణులకు గుణములు ఘటించు కుసుమాది సమ
ర్పణమున వస్త్రాదిక మా
క్షణమున పరిమళము నొందు కరణి కుమారా!

పూలవలన సువాసన వచ్చినట్లే సజ్జన సాంగత్యము వలన మంచి గుణములు కల్గును.

64. పదజనులు కట్టి విడచిన
పర చేలములైన గట్ట వలదు వలువలన్
నెరి మాయు మడత మార్చుచు
ధరియించుట యొప్పదండ్రు ధరను కుమారా!

భూమిపై తగని పనులు ఇతరులు కట్టి విడిచిన బట్ట కట్టుట, నలిగిన మడతలు కట్టుట.

66. మును మనుజుడు జన్మాంతర
మును చేసిన పుణ్య పాపములు పుడమిని వా
నిని బొందక విడువవు దే
వుని నిందింపకుము కీడు వొడుము కుమారా!

స్నానానంతరమే సుగంధ లేపనముగాని స్నానము బదులుకాదు. అట్లే నీళ్లు ఓడు బట్టను విదిలింపకూడదు.

67. అవయన హీనుని సౌంద
ర్యవిహీరను, దరిద్రు, విద్యరాని యతని సం
స్తవనీయు, దేవు, శ్రుతులన్
భువి నిందింప దగదండ్రు బుధులు కుమారా!

చేయదగని పనులు- వికలాంగుల , అందవిహీనుల, ధనహీనుల, విద్యావిహీనుల, గౌరవింపదగిన వారల, భగవంతుని, వేదముల నిందించుట నిరసించుట.

68. లోకమున సర్వజనులకు
నాకాలుడు ప్రాణహారియై యుండగ శో

భాకృతి కార్యముల వడిం
బ్రాకటముగ జేయకుండరాదు కుమారా!

కాలుడు ప్రాణములగొని పోవక మున్నే చేయదగిన కార్యముల త్వరితముగా చేయవలెను.

69. అల సరసాన్నంబు బరి
మళము గలుగు వస్తువులను మహితల యానం
బుల నాసనముల నుబ్బకు
కలుగుం జనుకాలవశముగాను కుమారా!

సుఖదు:ఖములు కాలానుగుణములు, సుఖములకు పొంగిపోక, దు:ఖమున కుంగి పోని వాడే మనుజుడు.

70. ప్రజ్ఞావంతుని చేతను
ప్రజ్ఞాహీనునకు వాటిల్లు నిలన్
బ్రాజ్ఞత గల్గి నటించిన
దత్‌జ్ఞున్నుతియింతురదియే ధనము కుమారా!

కుమారా! గుణవంతుడు సమయమునకు తగినట్లుగా నడచుకొనవలెను.

71. మనుజులు తన సౌఖ్యము కొర
కును సంరక్షణము నవని గోరుదు రొగి నే
జన పాలు(డు సంరక్షిం
పను దగియును బ్రోవ డతడె పాపి కుమారా!

రాజు సమర్థుడయ్యును దుష్టుల శిక్షింపకున్న తానే నరకము పొందును.

72. మండలతి దండార్హుల
దండింపక యుండరాదు ధారుణి నాత డ
ఖండల సమానుడైనను
మెండుగు పాపంబనొందు మెలగు కుమారా!

రాజైనవాడు న్యాయవిచారణ చేసి నిందితులను శిక్షింపనిచో తానే పాపమును పొందును.

73. గరళము పెట్టడు వాని
పరు జంప దలంచువాని బనులెల్ల బయ
ల్పరచెడివానం బరధన
హరుని నృపతి చంపి పుణ్యుడగును కుమారా!

రాజు హంతకుల, దుష్టుల, దుర్మార్గుల, దొంగలను శిక్షించిననే సమర్థుడు.

74. గృహ దాహకునిం బరదా
రహరుం బంధుహిత కార్య రహితుని దుష్టో
త్సాహపరుని జంపి నరపతి
యిహ పరముల యందు కీర్తి నెసగు కుమారా!

రాజు ఇళ్లను తగులబెట్టువానిని, పరదారాపహరిని, హితుల కార్యముల చెడగొట్టువానిని సంహరించిననే ఇహపరలోకముల ఖ్యాతి జెందును.

75. సత్తువగల యాతడు పై
నెత్తిన దుర్బలుండ తస్కరించు సతండున్
విత్తము గోల్పడు నతడును
జీత్తిని పీడితుండు జింత జెందు కుమారా!

శక్తిగలవాడు అశక్తుల పీడింపకూడదు.

76. కత్తిని చేతం బట్టుచు
మొత్తదలచి వచ్చుగాని ముఖ్యముగా మే
ల్లత్తించిన సదె ప్రాయ
శ్చితమని జంపదగదు చిన్ని కుమారా!

'అపకారికి ఉపకారము నెపమెన్నక చేయువాడే నేర్పరి సుమతీ' అన్న రీతిని తనను చంపవచ్చిన వానిని కూడా మంచితనముగనే శిక్షింపవలెను.

77. ఓరిమియె కలిగి యుండిన
వారలగని ప్రజ్ఞలేనివారని యెద రా
నారయ సత్పురుషావళికి
నోరిమియే భూషణంబు రోరి కుమారా!

సహనము కల్గిన వారిని జనులు తెలివిలేనివాడని నిందించినను, సహనమే మనిషికి నిజమైన ఆభరణము కుమారా!

78. పురుషుం డొనర్చని పనికి
నరయుగ దైవం బదెట్టులనుకూలించున్
సరణిగ విత్తక యున్నను
వరిపండునె ధరణిలోన వరలి కుమారా!

ఏ పనికైన ప్రయత్న లోపమున్న అది ఫలింపదు.

79. తన సత్కర్మాచరణం
బున భాగ్యము వేగవృద్ధి బొందు జగత్ప్రా
ణుని వర సాహాయ్యముచే
ననలం బెంతైన బెరుగనయ్య కుమారా!

సత్కార్యముల వలన సంపద, అగ్ని వాయువుతో వలె వృద్ధి చెందును.

80. చము రింకిపోయినను దీ
పము శమియించిన విధంబు పౌరుణ విహీ
నమె యగును; దైవ మనుకూ
లము గాకుండినను భూతలయిన కుమారా!

చమురు క్షీణించినపుడు దీపము కొండెకినట్లే భగవంతుడను కూలింపనపుడు పరాక్రమము క్షీణించును.

81. ఘన బీజపు సాయము లే
కను భూముల నిష్ప్రయోజకంబైన విధం
బున దైవము తోడిలఁగా
కనె పౌరుష కర్మఫలము గలదె కుమారా!

దైవ సహాయము లేనప్పుడు మనుజుడు చేయు పనులు, విత్తనము నాటని భూమి వలెనే, ఫలింపవు.

82. ధర నే వస్తువులైనన్
దరగుటకై వృద్ధినొందు దగ బొడవెదుగున్
విరుగుటకై పాయుటకై
దరిజేరును వీని మదిని దలతె కుమారా!

ఈ భువిలో వృద్ధి చెందుట తరుగుట కొరకే, పెరుగుల విరుగుట కొరకే, సమీపించుట దూరమగుటకే అని గుర్తెరిగి నడుచుకోవలెను.

83. జనియించుట పొలియుటకే
పెను సుఖమొందుటది కష్ట విధి నొందుటకే;
విను హెచ్చుట తగ్గుటకే;

యని మనమున నమ్మవలయునయ్య కుమారా!

జననము మరణము కొరకేనని, సుఖించుట కష్టములనుభవించుటకేనని, పెరుగుట తరుగుటకేనని బుధులాడుమాట నిజమని నమ్ముము.

84. ఎటువంటి వర కులంబున
బటు తరముగ బుట్టెనేని పరగగ మును గ
న్నటువంటి కర్మపలముల
కట కట భోగింపవలయు గాదె కుమారా!

ఎంత గొప్ప వంశమున జన్మించినను, పురాకృత కర్మఫలమును అనుభవించియే తీరవలెను.

85. పెక్కు జనుల నిద్రింపగ
నొక్కిండయ్యెడను నిద్ర నొందక యున్నన్
గ్రక్కన నుపద్రవంబగు
నక్కర్మమునందు జొరకుమయ్య కుమారా!

ఊరంతా ఒకదారి, ఉలిపికట్టె ఒక దారి అన్నట్లు జనులందరూ నిద్రించు సమయమున మెలకువగా నున్న కష్టములు వచ్చును.

86. మధురంబుల గొననొల్లడు
బుధజను డేకతమ దారిబోనొల్లడు నీ
విధ మెఱిగి నీవును మనో
రధ సిద్ధుడు వగుచు మెలగరాదె కుమారా!

నీవును పండితుని వలెనే ఏ పనిని ఒంటిగా చేయుటకు ఇష్టపడకుము కుమరా!

87. ధనవంతుడె కులవంతుడు
ధనవంతుడె సుందరుండు ధనవంతుండే
ఘనవంతుడె బలవంతుడు
ధనవంతుడె ధీరుడనుచు దలతె? కుమరా!

ధనమున్న అన్ని లోటులు కప్పబడునను జనులాడుకున్న మాటకు తగినట్లు ధనము సంపాదింపుము.

88. విను ప్రాణరక్షణమునన్
ధనమంతయు మునిగిపోవు తరి, పరిణమయం
దున, గురుకార్యమున, వధూ
జన సంగమమునందు బొంక జనదు కుమారా!

'హరిజాక్షులందు... బొందడధిప' అను శుక్రనీతివలె ప్రాణావసరములందు, వివాహ సమయమందు, గొప్ప ప్రయోజనము బొందునపుడు అబద్ధమాడినను తప్పు లేదని ఈ శతకకారుడు కూడ బోధించుచున్నాడు.

89. కులభామల విడువకు వెలి
పొలతుల వీక్షించి మోహమును బొరలకుమీ
ఖలు డందు రెట్టవారలు
గులహీనుడు పుట్టెననుట కొఱలు కుమారా!

కులకాంతను విడిచి పరస్త్రీలను కోరిన నిన్ను గుణహీనుడవని నిందించుటయే గాక, నాశము కూడా పొందెదవు.

90. చపలాత్ము డవని లోపల
నపాత్ర జనులకును దాన మందిచ్చుట హీ
నపు గుక్క నోటి లోపల
నిపుణత నెయిపోసినట్లు నెగడు కుమారా!

యోగ్యులు కాని వారికి నీయు దానము కుక్కకు పోయు నేయి వలె నిష్ప్రయో జనము.

91. యోగ్యుల నరయగ లేక య
యోగ్యులకున్ దాన మొసగుచుండట యిది స
ద్భోగ్యసతిన్ షండునకున్
బాగము గని పెండ్లి చేయు పగిది కుమారా!

దానమిచ్చునపుడు, ముఖ్యముగా కాంతలను, యోగ్యత నెరిగియే ఈయవలెను.

92. దీనుండైనను శాత్రవు
డైనన్ శరణనుచు వేడునపుడు ప్రియత స
మ్మానవుని కోర్కె దీర్చినా
వాని సుజనుడండ్రు బుధులు వసుధ కుమారా!

శరణన్నవాడు శత్రువైనను రక్షించుటయే ధర్మము.

93. పాపంబులందు నెక్కుడు
పాపము సుమీ! ధరిత్రి పై క్రోధగుటణం
బే పారు, లోభమును, విని
యే పురుషుల బెడద గూడ దిలన కుమారా!

మితిమీరిన కోపము, లోభము పాపములన్నింటిలో నెక్కుడు పాపము కల్గించు దుర్గుణములు కాన వానిని దరిజేరనీకుము కుమారా!

94. మును గల్గి ధర్మమును జే
యునతడు పేద వడెనేని యున్నంతకు దో
చిన భంగి సర్థులకును ని
చ్చునతడె బాహు పుణ్య పరుషుండు కుమారా!

పుణ్యపురుషుడు తనకు సంపద కల్గినను లేకున్నను యాచకుల రిక్తహస్తము లతో పంపడు.

95. కడు మెల్ల నిడు ను త్తర
మడచును గోపమును దీక్ష్ణ మరయగ దాన
ప్పడు నుడి వెడు ను త్తర మది
వడి గోపము బెంచు నరయ వసుధ కుమారా!

కోపమునకు విరుగుడు శాంతమే. ఎంతటి ముక్కోపి యైనను ఎదుటిమనిషి శాంతముగా ఉన్న తానే తగ్గను.

96. మిత్రుండు దనకు విశ్వా
మిత్రము జేసినను గాని మేలనవచ్చున్
శాత్రవుడు ముద్దగొన్నను
ధాత్రిం దన కదియె కీడు తలప కుమారా!

స్నేహితుడు లోకములనెల్ల విరోధిగా చేసినను అందులో హితమే దాగివుండును గాని విరోధి తనింటి ముందు భుజించినను అది అపకారమునే కల్గజేయును.

97. ధర నొక్క బుద్ధిహీనురన్
దిరముగ రోటనిడి దంచెనేనియు, బెటుచం
దురు, యగును గాని యతనికి
సరసత్వము గలుగదండ్రు సతతము కుమారా!

'చేరి మూర్ఖుని రంజింపరాదు' అను విధముగా బుద్ధిహీనుని రోట వేసి దంచిన ను బుద్ధిరాదు.

98. విత్తంబు విద్య కులము
స్మత్తులకు మదంబొసంగు; మాన్యులకున్ స

ద్వృత్తి నొసంగున్ వీనిన్
జిత్తంబున నిడి మెలంగ జెలగు కుమారా!

సజ్జనులకు మంచి నడవడి ఇచ్చుగుణములే దుర్జనులకు అహంకారము కలుగ జేయును.

99. ధర గరవుగోరి దానం
బిరువున నిడుకొనిన వాని నెగ్గింప దలం
తురు; వాని నమ్మదలచిన
పురుషుని నుత్తము డటంచు బొగడి కుమారా!

దానము పాత్రా, పాత్రత, యుక్తసమయములను ఎరిగి చేయకున్న జను లాదరిం పరు.

100. ఋణ మధిక మొనర్చి సమ
ర్పణ చేసిన తండ్రి విద్యరాని కొడుకు ల
క్షణశాలి రాణి దుశ్చా
రిణి యగు జననియును దలప రిపులు కుమారా!

లోకమునందు శత్రువులు ఋణభారము కొడుకుకిచ్చు తండ్రి, విద్యరాని కొడుకు, స రూపవతి అయిన భార్య, దుర్నడత కల్గిన తల్లి.